[illegible]

# ప్రసన్నకథా కవితార్థయుక్తి

[illegible]

*

సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తితో
నారసి మేలునా నితరులక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచనబంధురుడయ్యె జగద్ధితంబుగన్.

ఈ పద్యములో నన్నయ్యగారు తన కవితా ప్రపంచమునగల యనేక గుణములను పేర్కొనక మూడుగుణములనే ప్రధానముగా జెప్పికొనియెను. మొదటిది ప్రసన్నకథాకవితార్థయుక్తి, రెండవది అక్షరరమ్యత. మూడవది నానారుచిరార్థసూక్తులు. వీనిలో నన్నయ్యకు మొదటిది, మూడవది యను గుణములం దభిమానము గలిగినట్లును కనిపించుచున్నది. తన కవితలో నానారుచిరార్థ సూక్తులుండుట నన్నయ్యగారు తన కదియొక బిరుదముగా జెప్పికొన్నట్లు భాసించుచున్నది. పరిశీలింపగా నీ కాలమున ఆయన తాను ప్రత్యేకముగా జెప్పిన ఈ రెండుగుణముల యందును లోకమాదరము చూపుతున్న

పనుటకు విమర్శనము కనిపించుటలేదు. నన్నయ్యగారి సూక్తులు జగత్ప్రథితములు. ప్రతిధర్మము వేరొక పద్యముగా వ్రాయబడి యుండెను. పూర్వకాలమున నీ సూక్తులు దేశము నందు జనులు బహుధా వాడుకొనెడు వారేమో? కొన్ని పద్యములు నా చిన్నతనములో గూడ ప్రావాహికముగా జీవిత యాత్రలో పల్లెటూళ్ళలో వాడుకొనుట నే నెరుగుదును. ఈ నాడు సంస్కృతములో నున్న సూక్తులే గీర్వాణభాషావేత్తలు లోకవృత్తమున నుపయోగింతురు. ఆ సూక్తులనే సంస్కృతము రానివారుకూడ తప్పుల తడకలుగా చదువుచుందురు. భారతములో నున్న యనేకసూక్తి పద్యములు తెలుగు జీవితములో నుండి బహిష్కరింపబడినవి. దీనికి ప్రధానకారణ మింగ్లీషు చదువు. ఆ యింగ్లీషు చదువు మన కావ్యములను పాశ్చాత్య విమర్శనదృష్టితో చదువుట నలవాటు చేసినది. పాశ్చాత్య విమర్శ సూత్రములు పట్టించి దాని కాగని కవిత కవిత కానట్టు కవి కవి కానట్టు చెప్పింపబోయినది. మరియును సుష్ఠు శబ్ద జ్ఞానము లేని పలుమంది విమర్శకులై యున్నవిషయమును సరిగా చూడక లేని దానిని తను మనస్సులో కల్పించుకొని యిష్టము వచ్చిన చోట నధికగుణారోపణ చేయుచు నుండు చుండిరి.

కొన్నిచోట్ల కొన్ని విచిత్రసిద్ధాంతములు వ్యాప్తిలోనికి వచ్చినవి. శబ్దము సర్వభావము చెప్పలేదని యొకసిద్ధాంతము. నిజమైన కవియందు శబ్దాడంబర ముండదని యొకసిద్ధాంతము. మాటలు కొద్దిగా నుండవలయును. అర్థము దానికి కొన్ని రెట్లుండును. ఇదియే ధ్వనియని యొకసిద్ధాంతము. ఇది ధ్వని

సిద్ధాంతముకాదు. స్ఫూర్తి కలుగుటకు వానికనువైన సత్త్వముండి ననే స్ఫూర్తి కలుగును. గాలిలో దీపముపెట్టి 'దేవుడా నీ మహిమ' యనునది కవిత్వముగాదు. పాఠకులు ఈ విషయమున కొన్ని పొరపాట్లు చేయుచుందురు. తా నింగ్లీషులో నొక యూహ చేసి ఆ యూహ తన యిష్టమువచ్చిన కవియొక్క కవితలో నుండుననుకొనును. మరియొక కవి తా నేదియో వ్రాసి అందులో శబ్దములం దీయజాలని యర్థము తానున్న దనుకొనును. ఇవి నేయూహార్థములన్న కవిదోషములు. ధ్వని యనునది అచ్చటనున్న శబ్దముయొక్కయు, వాక్యముయొక్కయు, శక్తివలన కలుగును. ఊరికే గాలిలో పుట్టదు. ఈ ధ్వని యనేకములైనది. వీనిలో రసధ్వని పరమోత్తమమైనది. రసము, రసాభాసము, భావము, భావాభాసము, భావశాంతి, భావశబలత, మొదలైనవన్నియు రసకక్ష్యలో చేరును. ఈ రసధ్వని రెండు విధములుగా భాసించును. ఒకటి కవిశక్తి చేత. రెండవది రచనాశిల్పముచేత. రచనా శిల్పము మిక్కిలి గొప్పది. నన్నయ్యగారు ప్రసన్న కథా కవితార్థయుక్తి అని చెప్పుటలో నీ రచనా శిల్పమునుకూడ భావించినారు. ప్రసన్న కథా కవితార్థయుక్తి అన్న సమాసమునకు నాలుగైదు విధములుగా పదవిభజనచేసి అర్థములు చెప్పవచ్చును. ప్రసన్న కథయొక్క కవితార్థముయొక్కయుక్తి. ప్రసన్నమైన కథాకవిత్వముయొక్క అర్థముయొక్కయుక్తి. ప్రసన్నకథా కవితార్థముయొక్కయుక్తి. అనగా కవితార్థములో ప్రసన్నమైనకథవుండుట. కథ ప్రసన్నమగుట. ఇట్లు రెండు మూడర్థముల చెప్పికొనిన ఏదో కథాకవితయను నొక యర్థ మేర్పడి యింగ్లీషుభాషలో

నున్న "Narrative Poetry" అన్న శబ్దమునకు చక్కని యర్థముగా భాసించుచున్నది. కాని యీ కథా కవిత యన్నది మన పూర్వ లాక్షణికులలో జెప్పబడినట్లు కనిపించుటలేదు. అందుచేత నీ దృష్టియే మన పూర్వులకు లేదనుటయు గలదు. ఇదికాక 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' యనియు పాఠాంతరము గలదు. ఈ పాఠమే యెక్కువ సమంజసముగా గన్పించుచున్నది. సామంజస్యము రెండు విధములు. బహుతాళ పత్రగ్రంథములందు సమానముగానున్న సామంజస్య మొకటి. అర్థపుష్టిచేతను, తత్కవియొక్క భావనా సజాతీయతచేతను సమకూడునది. రెండవది నన్నయగారి కథా నిర్మాణవైఖరిని బట్టి చూచినచో ప్రసన్న కథా కలితార్థయుక్తి బాగుగా నున్నది. ప్రసన్నమైన కథతో గూడుకొనియున్న యర్థముల యోజన యని అర్థము. అనగా నచటనున్న యర్థములను చక్కగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్నమగును. అచ్చటనున్న యర్థములను చక్కగా యోజించవలయును. అచ్చటనున్న యర్థములలోపలనారయవలయును. ఈ పని కవీంద్రులు చేయుదురు, చేసి మేలందురని యాయనయే చెప్పెను. లో నారయక మేలు కాదనుట న్యాయముకాదు.

రచనా శిల్ప మిందులోని భాగముగానే నన్నయ్యగారు భావించియుందురు.

నన్నయ్యగారి తర్వాత కొన్ని వందల యేండ్లకు వచ్చిన రసగంగాధరకర్త గాని యీ రచనా శిల్పమును ప్రపంచింపలేదు. ఇది జగన్నాథ పండితునిచేత ప్రపంచింపబడక పూర్వమే సర్వ మహాకవులయందును భాసించుచున్నది.

వ్యాసుడు వేదములనువిడదీసినట్లు లాక్షణికులు కవితాలక్షణము లను విడదీసిరి. ప్రస్తుతము నా చెప్పబూనినది రచనా శిల్పమును గూర్చి కాకపోయినను తత్పరామర్శ కొంచెము కావించెదను. ఎందువలననగా నీ రచనా శిల్పము చేతనే యర్థము ప్రసన్న మగును.

ఈ రచనా శిల్ప మనంత విధములుగా నుండవచ్చును. ఒకచోట వృత్తముల నాశ్రయించి యుండవచ్చును. ఔచిత్య వేత్తలు దీనిని వృత్తౌచిత్య మనవచ్చును.

అరణ్యపర్వ ద్వితీయాశ్వాసాది యందు నన్నయ్యగారు నలోపాఖ్యానము వ్రాసినారు. అది రెండు వందల యిరువది నాలుగు పద్యముల కథ. ఈ కథలో నెచ్చటను శార్దూలము గాని, మత్తేభముగాని వ్రాయబడ లేదు. ఇది కరుణ రసము ప్రధానముగా గలిగిన కథ. ఈ కథకు ఆ రెండు వృత్తములు పనికిరావని నన్నయ్యగారి నిష్కర్ష. ఇట్లే యెల్లచోటుల జూడవచ్చును. భిన్న వృత్తము నన్నయ్యగారు వాడినచో దాని ప్రయోజనము వేఱయున్నదనియే వాడిరి. ఈ రీతిగా పరిణతమైన శిల్పమాయన రచన యందు సర్వదా భాసించు చున్నవి.

ఈ రచనా శిల్పము సూచికగా నొక చిన్న విషయము వ్రాసెదను.

"చిరముగ బ్రహ్మకున్ దపము చేసి యనంత డనంత ధారుణీ భరగురు కార్య శక్తుడయి పన్నగ ముఖ్యుల పొత్తు బాసి చె చ్చెర తన యంతనుండి మని చేర్చి తలంపడ యొక్కనాడు దు ష్కరతర దండ శూకకుల భావి భయప్రవిఘాత కృత్యముల్."

ఈ పద్యము భవిష్యత్తులో జరుగబోవు సర్పయాగమును గూర్చి భయపడిన వాసుకి తన సహోదరులతో చెప్పినది. ఈ పద్యములో "అనంత ధారుణీ భరగురు కార్య శక్తు"డన్నది యొక సమాసము. చివరి చరణ మంతయు నొక పెద్ద సమాసము. ఈసమాసము లెందుకు? ఏదియైన ప్రయోజన మున్నచో నది శిల్పము. నిష్ప్రయోజనమైనచో నది శబ్దాడంబరము.

ఒక కుటుంబంలో నొక యన్నగారున్నారు. అతడు పెద్ద యుద్యోగములో నుండి దూర దేశమునందు సుఖముగా నుండెను. ఇంటి దగ్గరనున్న కుటుంబము మిక్కిలి కష్టములనుభవించుచుండును. "వానికేమి మహారాజువలె నున్నాడు. మనమిచ్చట నానాబాధలు పడుచున్నాము." అని యనుట లోకము నందలిపద్ధతి. ఈమాటలలో నోటితో ననెడువాడు అతడు సుఖముగా నుండుటయు, తాము బాధలుపడుటయు, మిక్కిలిగా జెప్పును. ఆ యర్థములను జెప్పు పదములమీద కాకువును ప్రయోగించును. "నానా యిబ్బందులు పడుచున్నాము. నానా గడ్డి తింటున్నాము." మొదలైనమాటలు ఆవేశముతో చెప్పును. ఈ యావేశము కావ్యములో నెట్లు కననగును. నాటకములో రంగముమీద నటకుడు వాక్యగతభావమును తన వాచికముచే సాత్త్వికాద్యభినయముచే ప్రకాశింపజేయ వచ్చును. "కావ్యేషు నాటకం రమ్యమ్" అను దానిలో కొంత రహస్య మియ్యదియే. పూర్వకాలమున నీ బాధలేదు. మన పూర్వులప్రకారము కావ్యములు రెండురకములు— శ్రవ్యకావ్యములు. దృశ్యకావ్యములు. భారతాదులు శ్రవ్య

కావ్యములు. అనగా పాఠకుడు వినిపింపగా వినెడివి. ఎట్లు చదువవలయునో తెలిసినవాడే పాఠకుడు. వాడే చదివెడు వాడు. చదువునప్పుడు సర్వార్థములు గోచరించెడివి. ఈ నాడా శ్రవ్యకావ్యము లన్నియు పాఠ్యకావ్యము లైనవి. అంద రును పాఠకులుమాత్రము కాలేదు. ఈ దోషము జాతియందు నున్నదత్తమై యది కావ్యగతమైనదివలె కనిపించుచున్నది.

లోకము మాటాడుకొనునపుడు తాము చెప్పు నర్థము సువ్యక్తమగుటకును తమ కోపాదులు భాసింపజేయుటకును కొన్ని శబ్దములు బిగ్గరగా నావేశముతో నొక్కి చెప్పుదురు. ఇట్టిచోట్ల కవి శబ్దమయమైన మార్గాంతరముచేత వానిని ప్రకాశింప జేయువలయును.

లోకమొకప్పుడు కోపముకొలది కఠినములైన శబ్దము లను ప్రయోగించును. కవి తన కావ్యము నందట్లే చేయును. ప్రేమయున్నచోట సుకుమారముగా మాట్లా డును. పెద్దలతో ప్రసంగించునప్పుడు సభ్యతరమైన శబ్దములనే వాడును. లోకమెట్లో కవిత అట్లే. తత్తద్భావాను కూలముగ శబ్దములను వాడుట, కొన్ని యధిక ప్రయోజనము లను వాడవలసి వచ్చినప్పుడు సమాసములుపయోగించుట, ఆ సమాసములు యొక్క హ్రస్వత్వము, దైర్ఘ్యము తత్తద్భావౌ చితస్ఫోరకముగా ప్రయోగించుట కవితా శిల్పము. ఇది మహాకవుల కుగ్గుపాలతో పెట్టిన విద్య. ఈ పై పద్యములో నున్న రెండు సమాసముల యొక్క హ్రస్వత్వదీర్ఘత్వములు సరిగా ఆమాటలన్నవాని మనోవ్యాపారముల రెండింటిని విస్పష్టముగా స్ఫురింపజేయును. దీనినే మన పూర్వులు రస

ధ్వని యనిరి. ఇది యిచ్చట సమాసగతమై కనిపించుచున్నది. మరియొకచోట నన్వయగతమై యుండును. ఒక విధముగానేమి; బహువిధములుగానుండును. ఇది రసధ్వనియనుట నుపలక్ష్యము గానే చెప్పితిని. నిష్కృష్టముగా జెప్పవలయునన్నచో నిట్టి రచన రసధ్వని కుద్దీప్తి హేతువగును. అనగా నొక త్రోవేలెడి డను. రసకత్వాభాగ నిక్షిప్తమని యిట్లు చెప్పితిని. నన్నయ్య గారి రచన సర్వత్ర యిట్లుండును.

వట్టి వర్ణనలచోట నీ రచనా దీప్తి కనిపించదు. ఆవర్ణ నాంశములు రసవ్యంజనేతర భాగములు. తత్సృష్టి యుండదని గాదు. ఒకడు చెప్పు మాటలలో ప్రసంగములో వాని కామ క్రోధాది భావములు వాడు వెలువరుచుటలో నున్న మనుష్య హృదయ స్పందనము వర్ణనాంశములలో నుండదు. వర్ణనాంశ ములయందు కవి యొక్క యుత్ప్రేక్షాది కల్పనాశక్తియు, పాఠ కునియొక్క యూహాశక్తియు విజృంభమాణములగుచుండును. అప్పటి రచన సర్వత్ర యీశిల్పమున కొగ్గదు. ఈ శిల్పమచట తక్కువగానుండును. అచట కవియొక్క శక్తి రసధ్వనేతర ధ్వనులయందు ప్రకాశింపవచ్చును. ఆ ధ్వనులు వస్త్వలంకార ముల నాశ్రయించి యుండవచ్చును.

ఇట్టి రచనాశిల్పము కంటె భిన్నమైన శిల్పము ప్రతి భాషయొక్క పద్యరచన యందుండును. శిల్పమనగా చేయుట యని యర్థముకాదు. ఒకానొక సౌందర్య మా పద్యరచనయందు భాసించుట. పద్యమెత్తుగడ బాగుండుట, దింపుగడ బాగుం డుట. ప్రాస యతి స్థానములయందు కొన్ని రమ్యములైన శబ్ద ములు ప్రయోగించి పద్యమంతయు బాగుగా నున్నదనిపించుట.

పద్యములు ధారాశుద్ధికలిగి యుండుట. ఇట్టివి పద్యమునకు సహజమైన సౌందర్యమును సంపాదించు లక్షణములు. పైనుదాహరించిన నన్నయ్యగారి పద్యమువంటి పద్యమే తత్సామాన్య పద్యముకంటె నధికమైనది. ఇతర పద్యములయందు రమ్యముగా రచించినచో పద్యసౌందర్యముండును. ఆ పై పద్యమునందు శిల్పసౌందర్య మున్నది.

ఈ శిల్ప మక్షరగతమైకూడ నుండును. పూర్వాలంకారికులు చెప్పనిది నన్నయ్యగారు దీని నేకదేశగణగతముగా జేసినారు, చూడుడు.

"ప్రియమున దమయంతి పున
స్స్వయంవరము సేయగడగి సకల క్షత్ర
న్వయ వీరుల రావించిన..."

ఇది బాహుకుడు పర్ణాదునితో నన్నమాట కంద పద్యము యొక్క రెండునాల్గు చరణముల మొదల జగణము వేసినచో పద్యమొక విచిత్రముగా విరుగును. ఈ విరుగుటవలన పద్యమున శోభవచ్చును. పద్యమూరకే యందముగా కనిపింప జేయుటకు నన్నయ్యగారీపని నెప్పుడును చేయరు. 'పునస్స్వయంవర' మని నొక్కుటచేత బాహుకుడైన నలుని యాక్షేపణ ద్యోతమానమగుచున్నది. ఆ యాక్షేపణకు దీనివలన నుద్దీప్తి కలుగుచున్నది.

# నన్నయ కవితా ప్రశస్తి

నేటిభావకవులలో నన్నపార్యుని ప్రోద్బలం లేనివా డొకడూ లేడు.

రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

*

ఆదికవి. మాది అపూర్వశక్తి అని చెప్పుకునే నేటి భావకవులలో నన్నపార్యుని ప్రోద్బలంలో లేనివా డొక్కడూ లేడు. వాని కవిత్వమునం దయినట్లుగా అర్థస్ఫురణ మరి యే ప్రాచీన కవి వ్రాతలోనూ కాదు. ఏపక్షౌనెడి మాటలూ నవనీత సమానములు. కథావస్తువా నవరసభరిత పాండవచరిత. ఇక 'కవీంద్రులు ప్రసన్న కథాకవితార్థ యుక్తితో నారసి మే లనరా? 'ఇతరు లక్షరరమ్యత నాదరింపరా?'

యయాతి దుష్యంతుల చరిత్ర లందలి నన్నయ ముని తపోవన వాటికలలో గానము సేయుచు ఎక్కడ కక్కడి మనలను కుటిలమానవసంఘ మధ్యమునుండి వెలుపలికి గొనివచ్చి, కాననసీమకు, సరస్తీరములకు, అంబుద పథమ్ములకు గొనిపోవును.

"చని చని ముందట నాజ్యహావిర్భృత
సౌరభ ధూమ లతాతతులం
బెనగిన మ్రాకుల కొమ్మలమీద న
పేతలతాంతము లైనను బా
యని మధుపప్రకరంబులఁ జూచి జ
నాధిపుఁ డంత నెఱింగెఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్ర ని
వాసము దానగు నంచు నెదన్."

నన్నయ రచన ఆనాటి వైదికమతవ్యాప్తి కెంతయు ననుకూలమగు వాతావరణమును గలుగజేసిన దనుటకు పై పద్యము తార్కాణము.

"విమల యశోనిధీ! పురుష
వృత్త మెఱుంగుచు నుండుఁ జూవె వే
దములును పంచభూతములు
ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్
యముఁడును జంద్ర సూర్యులు న
హంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివి యుండఁగా నరుఁడు
దక్కఁగ నేర్చునె తన్నుఁ ద్రుచ్చిలన్"

అన్న పద్యమువలన నాటిప్రజ ప్రకృతి నెట్లుపాసించెడివారో, ప్రకృతి కర్మసాక్షియని వారికెంత విశ్వాస ముండెడిదో స్పష్టమగుచున్నది.

"ఇది మునికన్యయేని మరి
యేలొకొ యీ లలితాంగియందు
నా హృదయము తద్దయుందవిలె..."

అని ఆత్మసంశోధన చేసికొను మహారాజును సృష్టించి వాని కొక్కనికే కణ్వాశ్రమమున ప్రవేశ మిప్పించి ఆ రోజులలో రాజులకెంత వినయము, గురుభక్తి కలదో తెలియజేయుచున్నాడు.

ఇక లౌకికుడైన నన్నయను చూడవలతునేని యీ క్రింది పద్యములను చదువనగును :

"వినుతయశుండు పాండునృప
శేఖరుఁడు దిగ్విజయంబుఁ జేసి పెం
పునఁ గొనివచ్చి యిచ్చిన య
పూర్వమహాధనరాశి పేర్మి వా
రని విభవంబుతోడ ధృత
రాష్ట్రుఁడు సేసె శతాశ్వమేధముల్
దనరఁగ భూసురేశులకు
దక్షిణ లిచ్చి యథోచితంబుగన్"

"శూరుల జన్మంబు, సురల జన్మంబును
నేరుల జన్మంబు నెఱుఁగనగునె"

"నెట్టన ధర్మనందనుఁడు
నిన్నవలంబముసేసి యోడతోఁ
గట్టినయోడవోలె ..."

నన్నయ శైలి విషయము తీసికొనినచో — ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టమున,

"కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్"

అని వినుట కింపగునట్లుగా శబ్దములను కూర్చినాడు. ఈ యమకమునే పోతన తన పద్యములలో చాదస్తముగా వాడి పాఠకులను విసిగించినాడు. భారతములో కవిత్వమనబడు నది నన్నయ రచనలోనే గలదనియు, తిక్కన రచనలో విశేష ముగ నాటక ఫక్కీ కనబడుననియు వినబడు మాటలు సూక్ష్మ బుద్ధితో పరిశీలించినచో యథార్థములుగానే తోచును. గంగా నదిని వర్ణించుచు,

"హైమవతోత్తుంగ హైమశృంగంబున
నుండి భూమికి వచ్చియుదధిఁగూడి
గంగ నా మూఁడు తెరంగుల నదియు మం
దాకిని నా సత్పథంబునందు
సురసిద్ధముని వియచ్చరసేవ్య మయ్యె న
య్యురగలోకంబునం దొనర భోగ
వతి యన నొప్పి యున్నతి నిట్లు త్రిభువన
పావనియైన యప్పరమనదిని
పార్వతీశమకుటబంధ బంధురతరా
వాసగంగ నాడ వచ్చి..."

అని వ్రాసి నన్నయ నిజముగా తన కవితావాహిని భూమి కవతరింపజేసినాడు. ఉతంకుడు చేసిన నాగ స్తవమునందు, గాని, ఆస్తీకుడు చేసిన జనమేజయ యాగస్తుతియందుగాని వసిష్ఠుమహిమ వర్ణించునప్పుడుగాని పాఠకుల నేమియు నలయింపనిరీతి, భావ మొకటేయయ్యు తన వాగ్వైశారద్య

నుచే, అనర్గళమైన ధారచే మనోహరములైన పద్యములను వ్రాసినాడు.

"అంగనాజనుల యుత్తుంగసంగతకుచ
కుంకుమచందనపంకములయు,
వారివ ధమ్మిల్ల భారావకలిత ది
వ్యామోద నవపుష్పదామములయు,
వారివ ముఖస కర్పూరతాంబూలాది
వాసనా సురభినిశ్వాసములయు,
వారివ పరిధానచారు ధూపములయు
విలసిత సౌరభావళులు దాల్చి"

అన్న పాదముల నడక నలవరచుకొనిన మరియొక కవి ఆంధ్రములో ఒక్కడును లేడు. ఆధునిక రచనలలో గణనీయములైన యీ క్రింది గీతములను జూడుడు :

"ఏ నాక వియోగశాలివి హృదయరాగ
వేదనారేఖ, నాకలి వేగునామె
అంగుళీకిసలయచంచలాంచలముల
విడిపడి యనంతవిశ్వాన బడితి నాడు
అదియె మొదలేను సకలదిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తిపోవ
ఆ సమయమాదిగా అప్సరోంగనాను
రాగవీథుల, కిన్నరీరమ్యకంఠ
సీమలో, శ్రావణాంబుదాశ్లేషపాళి,
తారకాలోక పంక్తుల, మారుతోరు

పక్షముల, తిరుగాడుదు పవలు రేలు
కన్ను మోడుపు మెయివాల్పుగాని లేక॥

వీని రచయిత నన్నయ సమాసముల కూర్పును కొంత వర కలవరచుకొనెను గాని వానిలోని అర్థ ప్రసన్నత, భావ గంభీరత వీరిలో వెలియమ్యెను.

అర్జున తీర్థయాత్రా రూపమున ప్రాక్పశ్చిమ సముద్ర తీరముల వెంబడి మనలను దీసికొనిపోయి సంవత్సరం పన్నెండు నెలల కాలము దేశాటనము చేయించి తుదకు ద్వారకాపురి దరిజేర్చె.

"అందుల కేగి యే నిందీవరశ్యాము
నరవిందనాభు నంబురుహనేత్రు
సన్మిత్రు జూచి నా జన్మంబు సఫలంబు
జేయుదు..."

అని అర్జునిచే చెప్పించి లోకైకనాథు సమక్షమునకు గొంపోని పోవుచున్నాడు. ఆ తరువాత సుభద్రతో నెయ్యం సేయు వేళ ఆమె వేసిన ప్రశ్న లివి:

"అమరావతికి నెన యనగ నివ్వసుమతి
బరగు నింద్రప్రస్థపురవరంబు
జూచితిరే? పాండుసుతులందు సుఖమున్న
వారె? మాయత్త యంభోరుహాక్షి
కుంతీమహాదేవి కుశలినియే? మహా
వీరు డర్జునుడు జితారి తీర్థ
గమనోన్ముఖుండయ్యె
క్రమ్మరి వచ్చెనే?

ముచే, అనర్గళమైన ధారచే మనోహరములైన పద్యములను వ్రాసినాడు.

"అంగనాజనుల యుత్తుంగసంగతకుచ
కుంకుమచందనపంకములయు,
వారివ ధమ్మిల్ల భారావకలిత ది
వ్యామోద నవపుష్పదామములయు,
వారివ ముఖస కర్పూరతాంబూలాది
వాసనా సురభినిశ్వాసములయు,
వారివ పరిధానచారు ధూపములయు
విలసిత సౌరభావళులు దాల్చి"

అన్న పాదముల నడక నలవరుచుకొనిన మరియొక కవి ఆంధ్రములో ఒక్కడును లేడు. ఆధునిక రచనలలో కమనీయములైన యీ క్రింది గీతములను జూడుడు :

"ఏ నాక వియోగశాలివో హృదయరాగ
వేదనారేఖ, నాకలి వేగునామొ
అంగుళీకిసలయచంచలాంచలముల
విడివడి యనంతవిశ్వాన బడెతి నాడు
అదియె మొద లేను సకలదిశాంతరాళ
మెల్లెడెల నెందుకో పర్వులెత్తిపోవ
ఆ సమయమాదిగా అప్సరోంగనాను
రాగవీథుల, కిన్నరీరమ్యకంఠ
సీమలో, శ్రావణాంబుదాశ్లేషపాళి,
తారకాలోక పంక్తుల, మారుతోరు

పక్షముల, తిరుగాడుదు పవలు రేలు
కన్ను మోడుపు మెయివాల్పుగాని లేక”

వీని రచయిత నన్నయ సమాసముల కూర్పును కొంత వఱ కలవరచుకొనెను గాని వానిలోని అర్థ ప్రసన్నత, భావ గంభీరత వీరిలో వెలియయ్యెను.

అర్జున తీర్థయాత్రా రూపమున ప్రాక్పశ్చిమ సముద్ర తీరముల వెంబడి మనలను దీసికొనిపోయి సంవత్సరం డెండు నెలల కాలము దేశాటనము చేయించి తుదకు ద్వారకాపురి దరిజేర్చి,

“అందుల కేగి యే నిందీవరశ్యాము
నరవిందనాభు నంబురుహనేత్రు
సన్మిత్రు జూచి నా జన్మంబు సఫలంబు
జేయుదు...”

అని అర్జునిచే చెప్పించి లోకైకనాథు సమక్షమునకు కొనిపోవుచున్నాడు. ఆ తరువాత సుభద్రతో నెయ్యం సేయువేళ ఆమె వేసిన ప్రశ్న లివి :

“అమరావతికి నెన యనగ నివ్వసుమతి
బరగు నింద్రప్రస్థపురవరంబు
చూచితి రే? పాండుసుతులందు సుఖమున్న
వారె? మాయత్త యంభోరుహాక్షి
కుంతీమహాదేవి కుశలినియే? మహా
వీరు డర్జునుడు జితారి తీర్థ
గమనోన్ముఖుండయ్యె
క్రమ్మరి వచ్చెనే?

ఇందు "జితారి" అనుమాట నుపయోగించి నన్నయ నిజముగా కవిత్వమును జయించినవా డయినాడు. నడకే కుంటువడునట్లు కనబడును. గాని అంతలో మహోన్నతమేరు శృంగమునకు గొనిపోయి మనకు దివి బారెడు దూరమా యని తోపజేయును.

రాజరాజనరేంద్రు నాదరణమునందున్న యీ కవి భారతరచనవలన ననితరసాధ్యమైన యశస్సు గడించుకొని నాడు. కాని రెండున్నర పర్వములుమాత్రము వ్రాయగలిగి మిగిలినది భవిష్యత్తున కొప్పగించి తనువు చాలించిన యితని జీవిత మాంధ్రజనులను చరిత్రముగ్ధులను జేయుచున్నది. తెలుగువారి విజ్ఞానతృష్ణ పూర్తిగా నుపశమింపక మునుపే తన కవితారసవాహినిని దివికై త్రిప్పుకొనిపోయిన యీ కవి ఆంధ్రుల హృదయములలో తీరియు తీరని కోరికను రగుల్కొల్పుచు చిరస్మరణీయుడై యున్నాడు.

# నాటకము — పద్యములు చదువుపద్ధతి

రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి



సాహిత్యసీమలో నాటకమునకుగల ప్రాముఖ్యత విజ్ఞులు నిరూపించియే యున్నారు. కావ్యము రెండువిధములనియు, అందుదృశ్యకావ్యము చూపుల కానందదాయకమగుననియు, దానివలన నిరక్షరాస్యులకుగూడ నానందముగల్గుననియు లక్షణజ్ఞులు తెల్పిరి. శ్రీనాథుని కాలమున నాటకము లాడబడుచుండెనని, అవి సామాన్యజనుల కాహ్లాదము కలిగించునవిగా నుండెనని, మనకు 'వీథినాటక' మనబడు క్రీడాభిరామము వలన దెలియుచున్నది. కాని పండితులను, పామరులను ఆకర్షింపజాలి హృదయములనురంజింపజేయునాటకమిటీవల, అనగా శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కాలమున, తొలుత రచింపబడెను. కావున వారినే నాటకపితామహులని చెప్పదగును. వారు కాళిదాసుని శాకుంతలము ననువదించుటయేగాక పెక్కు ప్రహసనములను గూడ వ్రాసిరి. వారివలెనే శ్రీయుతులు చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహారావుగార్లు గూడ నాటక రచనలో కృతకృత్యులైరి. ఇటీవల శ్రీ తిరుపతి వేంకటకవుల నాటకములకున్న ప్రచారము వేరేనాటకములకు

గానము. ఈ నాటకము లన్నిటియందు సంగీత శ్రవణము తప్పని సరిగా ప్రేక్షకలోకము సలయించుచున్నది. ఒక్కొక్క పద్దెము ప్రేక్షకుని కోరికమీదనో రెండుమూడు తడవలు గూడ పఠింపబడి బాధాకరమగుచున్నది.

శ్రీ రాఘవాచారి మున్నగు పాశ్చాత్య కళాపరిశీలకు లెంతగా నుద్బోధించినను మనదేశీయులు సంగీతమునందలి వ్యసనము విడనాడలేకుండుట కడు శోచనీయము. మితిమీరిన సంగీతమువలన రసభంగమగుటయేగాక యపార్థస్ఫురణకూడ కలుగుచున్నది. అదియుగాక తానర్థవిస్ఫురణచే సాధింపగలిగినది సంగీతముచే సాధింపజాలడని నటుడెరుగవలెను. ఒక పర్యాయము బందరులో 'సరిపదనిసంగతులు' అను నాటకమును ప్రదర్శించి శ్రీ రాఘవ సంగీతముయొక్క యనావశ్యకతను తేటతెల్లమగురీతిని నటించిరి. రెండు మూడు పద్దెములు గూడ చదివిరిగాని యవి చదువునప్పుడు సంగీతమేమియు లేదు. అట్లయ్యు నేమి రసభంగముకాలేదు.

ఒక్క పద్దెముగూడ లేని కన్యాశుల్క నాటకము ఒకానొక సందర్భమున విఫల ప్రదర్శనమాయెగదా, అట్టితరి సంగీతమేల కోరవలెనని కొందరు ప్రశ్నింతురు. కన్యాశుల్కమునకు దగిన ప్రేక్షకులు మనదేశమున లేరనినది తప్పుగాదు. కన్యాశుల్కకారుడు గొప్ప సంఘ సంస్కరణ దృష్టితో ఆ నాటకమును రచియించెను. నీతిబోధ మాకాలమున నచ్చదు. అందుచే నీతుల నేకరువుబెట్టించుటకంటె వ్యక్తులను వారి కుటిల వ్యాపారములను పాత్రల ద్వారా చూపిన బాగుండునని కవి యీ నాటకమును వ్రాసెను.

కన్యాశుల్కమువంటి యుత్తమ సాంఘిక నాటకము వేరొండు గానము.

ఇప్పుడు దేశమున నాడబడు నాటకములలో నటులు లోపరహితముగా నటించుట లేదని చూచినవారికి తెలియును. చింతామణి నాటకమునందు భవానీశంకరుని వేషము వేసిన యతడు పోగరుబోతుతనమును నటించుటకు బదులు తానే పోగరుబోతగుచున్నాడే! వివిధ పాత్రలను సృజించు కవి యేయొక పాత్ర యభిప్రాయములకు తానుత్తరవాదికాడో అట్లే నటుడుగూడ తన పాత్రాభినయ సమయములో ఒడలు మరచునంత ఉన్మత్తస్థితికి రాదగదు. రంగస్థలము నటుల కళాక్షేత్రముగా నుండదగునుగాని యేవో రెండు మాటలు వల్లించి నాల్గుడబ్బులార్జించుకొనుట కేర్పడినదిగాదని నటు లెరుగవలెను. అట్లని పారంపర్యము నుజ్జగింపుడనుటయు సబబుగాదు. పద్యములు చదువుడు. రాగయుక్తముగనే చదువుడు. ఏ పద్యమున కేరాగముండవలయునో ముందే నిర్ణయించుకొని ఆ ప్రకారముగనే కృషి గావించి తద్రీతినే ప్రదర్శనమున జదువుడు. కాని నాటకరంగము పాటకచేరీగా చేయదగదని నా మనవి.

ప్రేక్షకులను తన్మయస్థితికి గైకొనివచ్చునది నాటకమునందలి రసవత్తరఘట్టముగాని సంగీతముగాదని మరొక పర్యాయము వక్కాణింపవలసి వచ్చుచున్నది. ఈవిషయ మాధునికరచయితలన్ని దేశములలోనూగుర్తించిరి. బెర్నార్డుషా, గాల్సువర్దీ మున్నగు నాంగ్లేయ నాటకకారులు తమ నాటకములలో నొక్క గీతమేనిలేని యనువున యావత్కథను

వచనరూపముననే కొనసాగించిరి. బెర్నార్డుషా వ్రాసిన 'Man and Super man' అను నాటకము తీవ్ర వేదాంత బోధకమైయుండియు పఠియితలనేమియు నలయింపనిరీతి కేని హేతువోయించు కాలోచించితిమేని యందులకు కారణము కవి యొక్క నిర్మాణ చాతుర్యమని మనకు తెలియగలదు. సంభాషణలలోనే పాత్రల వ్యక్తిత్వము కన్నులయెదుట మూర్తీభవించును.

మద్విరచితమగు 'కట్నపు సొమ్ము' (ఆంధ్రవార పత్రికలో ప్రచురితము) నాటికలో నొక్క గీతమేనియు లేకుండ కేవల వచన రూపముగా నేను వ్రాసితిని. అటుతరువాత 'ముని పత్ని' యను నాటికను వ్రాసితినిగాని యందుకొన్ని గీతములు గలవు. వానిని యథోచితముగ బఠింపదగునేగాని విపరీతమైన గానముచే భావమే మరుగుపడునట్లు చదువవలదని నటులకు నా హెచ్చరిక.

ప్రేక్షకుల హృదయములను గదుపజాలునది సంగీత శ్రవణముకంటె, నాటకమునందలి రసవత్తరఘట్టమని చెప్పుటకై క్రింది యుదాహరణ మొకటి దీసికొని యీ వ్యాసమును ముగింతును. బెర్నార్డుషా వ్రాసిన Man and Super man నాటకములో మెండోజా యను దొంగలనాయకుడు తన ప్రియురాలినిగూర్చిన పద్యమును చదువుపట్టున గన్పరచెడు నుద్వేగ మసామాన్యము. ఏ శృంగారనాయకుడు అంతమనోజ్ఞముగా తన భావమును వెలువరచి యుండడు. కవి తన చాతుర్యముచే నట్టి దృశ్యమును సృష్టించియున్నాడు. ఆ తావున వ్రాయబడిన గేయమతి స్వల్పము. దానిని చదువునటుడు సంగీతప్రియుడై

మును బోనాడి నటనానిమగ్నుడు కావలెను. రెండవది తాను తన యప్పటిస్థితిలో తాత్కాలికముగానైన ఏకీభావము చెంద వచ్చును. మద్విరచితమైన 'నలచరిత్ర'లో నలుడశ్వశాలలో వార్ష్ణేయజీవలులతో గలిసి నిదురించు పట్టున, కొంతకాలము వఱకు మేల్కాని యీ క్రింది గీతమాలపించును.

"ననుబాసి యెటనుంటి నా ప్రియురాల
దుర్మార్గుడని నన్ను దూషింతు వాకొ్కా
సియుంపపందముల్ నీగుణావళియు
మదినెంచి మన్నింతు మందభాగ్యుడను.

నటు డీపద్యమును చదువుటకు సంగీతమేమియు ఆవశ్యకముగాదు. చక్కని కంఠస్వరము, మంచియుచ్చారణయున్నచో నేతత్కావ్య పఠనము జయప్రదమగును.

# ఆంగ్ల కవిసార్వభౌముడు బెర్నార్డుషా

రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

*

ఇకముందు బహిరంగసభలలో ఉపన్యసింపనని ఇటీవలనే నియమము పూనిన ఆంగ్లకవి. కవి యనుటకంటె నాటక కర్తయనుటయే చెల్లును. అంతమాత్రం చేత కవిత్వం అల్లలేడనిగాదు. ఒకానొక నాటికను తేటగీతలో వ్రాసి దాని పీఠికలో అతడిట్లు వ్రాసెను. 'పద్యములో వ్రాసితినిగాన ఇది ఒక వారములోనే పూర్తిఅయినది. గద్యములో వ్రాసిన యెడల నాకు ఒకనెల తీసుకొనెడిది' అని. వచన రచనలోగల పటిమ పద్యంలో లేదని అతడి అభిప్రాయం.

ఆ ఒక్కనాటిక తప్ప తక్కినవన్నీ వచనంలో వ్రాసినాడు. అయిదు నవలలు, పెక్కు వ్యాసములు, పెక్కు విమర్శలు, ముప్పది నాటకములు వ్రాసినాడు. జగద్విఖ్యాతి గాంచినాడు. నోబుల్ బహుమతి పడసినాడు. షేక్స్పియరు మహాకవితో సముడని కొందరు, మించినవాడని కొందరు, అతనికి మహోన్నత స్థానమిచ్చారు, స్వార్థరహితులై ఉదారమతులైన ఆంధ్రులు కొందరు రవీంద్రునికంటె షాయే గొప్పవాడని సగర్వంగా వాదించేవాళ్ళని నే చూశాను. ఎట్లయినా

రవీంద్రునికి, షాకు ఉత్తర దక్షిణధృవములకున్న తారతమ్య మున్న మాట నిర్వివాదము. రవీంద్రుని దృష్టి ఉన్నతులమీద ఉంటుంది. షా దృష్టి అంతస్సులలో ఉంటుంది. ఇద్దరూ నోబుల్ బహుమతులు పడసిన మహాకవులే. రవీంద్రుని ప్రాచ్య ఆధ్యాత్మికతా సందేశమును పాశ్చాత్యులు నేటికి గ్రహింపగలిగారు. షా యొక్క మానవజీవిత వేదాంతరహస్యములను ప్రాచ్యులీనాటికి గ్రహింపగలిగారు.

మన్ని మనకు యథార్థస్వరూపమున చూపించటమే కళాస్రష్టయొక్క కర్తవ్యమని అతడు నిర్వచించాడు. సంసు సున్నా దగ్గర బయల్దేరి అతడు వ్యాసరచయితగా, నవలా రచయితగా, నాటకకర్తగా, స్వయంకృషివలన, కష్టజీవనము వలన పైకివచ్చి నేడు కోటీశ్వరుడై యున్నాడు. ఇరవై అయిదేళ్ళు వచ్చేదాకా నేను నరభక్షకుణ్ణి, తరువాతమటుకు శాకాహారిని అని అతడు హాస్యాత్మకంగా చెప్పాడు. అనగా తన తల్లి సంపాదనమీద బ్రతుకుతూ చదవడం, వ్రాయడంతో కాలమంతా తన కళకై వినియోగించుకొనేవాణ్ణి అని విశదీకరించాడు. తన ఆదర్శము నిర్మించుకోవడానికే అతని జీవితంలో మొదటి పాతికేండ్లూ సరిపోయినాయి.

అతని జన్మభూమి ఐర్లెండు. అది వీడి లండను మహాపట్నము వచ్చినాడు. కొన్నాళ్ళు సంగీత విమర్శకుడుగా ఒక పత్రికకు వ్రాస్తూఉండేవాడు. తరువాత చిత్రకళా విమర్శకుడుగా మరొక పత్రికకు కొన్నాళ్ళు పనిచేసినాడు. ఇంకా అనేకము లితరవ్యాసములు వ్రాస్తూ డబ్బు సంపాదిస్తూ వుండేవాడు. కాని బహుస్వల్పం. ఏడేండ్లలో ఏడుపౌన్లు మాత్రమే

సంపాదించగలిగాడు. ఈ కాలంలోనే అతడు నవల వ్రాయటం మొదలుపెట్టాడు. పూర్తియైనపిమ్మట నొక గ్రంథ ప్రకాశకుని వద్దకు తీసుకొనివెళ్ళి చూపించాడు. అతడు కృతజ్ఞతతో దాన్ని తిరిగి యిచ్చివేసి, 'మీరు హాయిగా వ్రాతపని మానుకొని మరొక వృత్తియేల చూచుకొనగూడదు?' అని సలహాకూడా యిచ్చాడట. కాని షా నిరుత్సాహపడలేదు. నవలలు వ్రాయటం మానలేదు. అదివరకటంటే యెక్కువ తొందరగా వ్రాయటం మొదలుపెట్టాడు. రోజుకి పదిపేజీలు చొప్పున వ్రాయకతప్పదని పూనుకున్నాడు. ఆవిధంగా అయిదు నవలలు వ్రాసినాడు. అవి ప్రచురిస్తారేమోనన్న ఆశతో అనేకమంది ప్రచురణకర్తలకు బంపినాడు. ఆతడార్జించిన 7 పౌనులు పోస్టేజి క్రిందే అయిపోయుంటుందని అతని జీవిత చరిత్రకారుడొకడన్నాడు. తరువాత నెమ్మదిగా నాటకాలు వ్రాయమొదలుపెట్టాడు. అందులో తనకు సహజమైన నైపుణ్యం కలదని అతడు కనిపెట్టాడు. ఒక పత్రికా విలేఖరి అతన్ని అడిగినాడట. 'మీరు వ్రాయటం ఎన్నోయేట మొదలెట్టారు?' అని. "నేను గాలిపీల్చటం ఎప్పుడో వ్రాయటం అప్పుడే మొదలు, కాని చిత్రించడంమటుకు నా ముప్పైఅయిదో యేట" అని సమాధానం చెప్పాడట. మామూలుగా వచనంవ్రాయడానికి నాటకం వ్రాయడానికి చాలా తేడావుందని అతని అభిప్రాయం. చివరకు వ్యక్తిత్వముగల అతనిశైలి అతనికేర్పడినది.

షా నాస్తికుడు, సామ్యవాది, నియమబద్ధుడు. జితేంద్రియుడు. కాని యింకొక నిమిషాని కివేసిగాడు. ఒక నాటక కర్త మాత్రమే. ఒక వార్తాహారుడు షాను కోరినాడట మీ

అంతరాత్మనుగూర్చి కొంచెం ముచ్చటించండని. షా బదులు చెప్పాడు. "మూఢుడా! షేక్స్పియరువంటివాళ్ళకీ నావంటి వాళ్ళకీ అంతరాత్మ లుండవని తెలుసుకో. లోకంలో వున్న యీ అంతరాత్మ లేమిటో గ్రహించి వాటిని నాటకరూపంగా చిత్రించడమే మాపని."

ప్రతివ్యక్తికీ కావలసిన గ్రంథకర్త కేవలం కళాపరుడు మాత్రమేకాక వేదాంతికూడ అయియుంటాడని చెప్పినాడు. తాను అట్టి కళాపరుడగు వేదాంతి అని చెప్పినాడు. తన పాత్రలచేత చెప్పించిన అభిప్రాయములకు తాను సంపూర్ణ బాధ్యత వహింపకుండుట తన యుద్దేశ్యము కాదనియు, వాళ్ళ వాళ్ళ అభిప్రాయాలన్నీ ఆ యా నాటక సందర్భాల్ననుసరించి తనవికూడననియు ఆతడు స్పష్టపరచినాడు. కాని కొందరిమతంలో సరియైన అభిప్రాయమంటూ ఒకటి తప్పక కలదనియు అది మామూలుగా తమదేయనియు ఉంటుంది. కాని వారి యీ అభిప్రాయంతో ఏకీభవించేవాడు నాటకకర్త కాజాలడన్న మాటమటుకు నిజమనిన్నీ, మానవకోటిని గూర్చిన విజ్ఞానము వారికేమాత్రమూ అబ్బదనిన్నీతన దృఢమైన విశ్వాసముగా అతడు తెలిపినాడు.

కేవలం కళకోసమని తాను ఒక్క వాక్యంకూడా వ్రాయ లేదనియు, తన అభిప్రాయాల్ని తన అభిరుచుల్ని తన వేదాంతాన్ని లోకానికి తెలియజేయడానికి కళనొక సాధనగా మాత్రం తీసుకున్నానని చెప్పినాడు. తాము చెప్పవలసినది ఉన్నా లేకపోయినా కొందరు ప్రముఖులున్నారు. సారస్వతమన్నా వక్తృత్వమన్నా వారికెంతో ప్రేమ. కాని వారు చెప్పేదల్లా

యేమిటంటే సుప్రసిద్ధులైన యితరకవులను తాము ఎంతవరకు అర్థంచేసుకో గలిగినారో అదే తమ తమ యుక్తుల ననుసరించి మార్చి చెబుతూ తమస్వంతమల్లే ప్రచారం చేసుకోవడమే కళఅని నంకపెట్టుకొని నీతిబాహ్యములైన వ్రాతలు వ్రాస్తూ వుంటారు. ఆలోచనలేని యీ వ్రాతలు పామరజనాకర్షణ మీద కొంతకాలం బ్రతికినప్పటికీ, సారస్వతంలో వాటికి ఎట్టి స్థానమూ లేకపోవటయేకాక దుర్గతిగూడా పడుతుంది.

షా తనదేశమనిగాని తన జాతియనిగాని దురభిమాన ముంచుకోక వారివారి లోపములను తీవ్రముగా విమర్శించి నాడు. షేల్లీ, ఇబ్సెను, టాల్‌స్టాయిల ప్రాపంచిక జ్ఞానము, మనస్తత్వము తన కనుగుణమైనవే యనియు, షేక్స్పియరు డికెన్సులనుగూడ తాను శ్రద్ధగా చదివినప్పటికీ సమగ్రమైన వారి యనుభూతులు ఎట్టిమతమునుగాని ఎట్టివేదాంతమునుగాని సంకల్పింపవనియు చెప్పినాడు. షేక్స్పియరు యొక్క మనస్తత్వం, ప్రాంచికజ్ఞానము ఇట్టిదని షా ఒక్క వాక్యంలో చెప్పినాడు. 'షేక్స్పియరుమహాకవికి ఈలోకమంతా ఒక అజ్ఞానుల రంగస్థల ముగాదోచి, దాని మీద అతడు ఏమీతోచక నిర్ఘాంతపోయి చూస్తున్నట్టుగా అతని నాటకాలవల్ల స్పష్టమౌతుంది' అని.

ఇంతకు బెర్నార్డుషాది ఆంగ్లదేశము, వాక్స్వాతంత్ర్య మున్నదేశము, ఎన్నిసాంఘిక విప్లవాలైనా రాదగిన దేశము. మనదో ఆంధ్రదేశము, అనాధదేశము; ఎవరైనా స్వతంత్రించి తమ అభిప్రాయాల్ని వెల్లడిచేయబోయూరా వారినోటికితాళం. ఆ అభిప్రాయాన్ని ఏ పత్రికైనా సాహసించి ప్రచురించిందా మర్నాడు పత్రికాలయానికితాళం. ఈ వాగ్బంధమే లేకపోతే ఈ పాటికి మనదేశంలో ఎంతమంది బెర్నార్డుషాలుతయారయేవాళ్లో!

# శ్రీ కృష్ణశాస్త్రి

రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

*

ఆధునికాంధ్ర కవి శిరోవతంసులైన శ్రీకృష్ణశాస్త్రి గారిని గూర్చి యొక వ్యాసం వ్రాయండని మిత్రులు కోరారు. వారితో చిరకాలపరిచితి కలిగియుంటిననుట సత్యమే. కాని యెందుచేతనో కలం వెనుకాడింది. వెనుకటి గాథ కనుల యెదుట స్పష్టముగా దోచినది. అవి నా కళాశాలకేగిన దినములు. కేవలము మధ్యయుగ వాఙ్మయ పఠనవశముగా హర్షోల్లసిత మనస్కుడనై యుంటినేగాని యప్పటికింకను నవీన కవితాస్రవంతికి దరిదాపులకైన పోజాలనైతిని. సకృత్తుగా భారతీ పత్రికావలోకనము గలదు. కాని యేలనో అందు శ్రీకృష్ణశాస్త్రి రచనలెక్కువగా దృగ్గోచరము కాలేదు. భారతి యువకవులను కొందరను మరియు నండూరి మొదలగు ప్రౌఢ కవులను ఆదరించినమాట వాస్తవమే. కాని దేవులపల్లి వంటి భావాత్మక గేయ రచయితలను తనవైపున కెక్కువ యాకర్షించుకొనలేదు. దేవులపల్లికి స్వచ్ఛందముగా వ్రాయు నీప్సిత మాదినుండియు గలదు. వారి కృష్ణపక్షమే యందులకు

ప్రబల తార్కాణము. ఈ కావ్యము తొలుత 1925 లో ముద్రితమయినది. అప్పటికి కవి వయస్సు 28 సంవత్సరము లుండెను. అందలి రచన లాకవి విలక్షణత్వము విశదపరచుటయే గాక వారిలోగల భగవత్సాన్నిధ్యసాధననుగూడ చాలవరకు చాటుచున్నవి. ఏకేశ్వరోపాసకులనియు, నిరాకారవాదులనియు వారినిగూర్చి యీ కావ్యమందలి పద్యములే దేటతెల్లము చేయును. ఈ గ్రంథము బ్రహ్మ మతానలంబుల కత్యంత ప్రాణప్రదమై తదితరులకుకూడ దుఃఖజీమూతములను పార ద్రోలగల ప్రభంజనముగా నుపకరించుచు వచ్చినది. కన్నీరు, పాకీ మున్నగు శీర్షికలుగల ఖండకావ్యములు పత్రికలలో ననూనమగు పరివర్తనమును గొనితాగలిగియుండెను. అయినను శ్రీకృష్ణశాస్త్రిగారు కళకొరకు కళ నారాధించిన వారను నారోపణలకు గురికాకపోలేదు. కళాస్రష్ట యట్టి యాత్మ విస్మరణముననుండిననేగాని యుజ్వలములగు రచనలకు కర్త కాజాలడు. కృష్ణశాస్త్రిగారిలో అస్పష్టత (Vagueness) అను నింకొక లోపము విమర్శకు లాపాదించుచు వచ్చిరి. కాని మైహికబంధములను బాసి యాధ్యాత్మిక వీధులలోనికి జార జాలిన వారికీవిధమైన యాక్షేపణ కేవల మభూతకల్పనగా దోచును.

కృష్ణపక్ష మాద్యంతము చదివినచో నందు స్వేచ్ఛా ప్రియుని యుపలాపములే యెల్లెడను గోచరించును. దుఃఖము నకు క్రుంగిపోక వినమ్రతతో భగవదాదేశమును శిరసునదాల్ప గల ధీమంతుడే యీ కావ్యమునందలి నాయకుడు. అతడు తానొకప్పుడు పక్షియై గగనవీధులలో నెగిరినను, మరొకప్పుడు

తేటినై పూవు పూవునకును బోయినను, మందమారుతమై సెలయేటి భంగములపై నూగులాడినను అంతయు స్వేచ్ఛాపరత్వమునే సూచించును. స్వేచ్ఛాగానము 1, 2 శీర్షికలు పై విషయమును వ్యక్త మొనర్చును. వీరి రచనలో వీరరస పోషణముగూడ నందందు గలదు. అది దయావీరమనవచ్చును. తూదారుల బాధలనుగూర్చి యుమ్మలించునప్పుడే కవి లేఖిని యుద్వేలీయముగా సాగినది.

కృష్ణపక్షము నొకటి రెండు పర్యాయములు సాకల్యముగా జదివిన మీదట నాకు శ్రీ కృష్ణశాస్త్రిగారి దర్శనభాగ్యమబ్బినది. ఆనాడు వారు శ్రీ రాజావారి కళాశాలలో నుపన్యసించుటకు వచ్చినప్పుడు నాలో నవీన కవితామధువు చిలికినది. వారు పాడగా నేను విన్న పింగళి, కాటూరుల కవితాసామగ్రి, విశ్వనాథ వేగిక్షేత్రము, నండూరి యెంకి పాటలు చిరకాలము నా మనఃఫలకమున హత్తుకొని యుండినవి. తరువాత కవిత్వమును గూర్చి వారికిగల సాధారణాభిప్రాయములను తెలిసికొనవలెనని నేను వారితో రెండు మూడు తడవలు ప్రసంగించి యుంటిని. వారు నవీన కవితా మార్గదర్శకులయ్యు ప్రాచీనకవిత నొడనించుకయు నీర్ష్యనుజూపరైరి. నన్నయ యనిన వారి కమితమగు ప్రేమ. నన్నయ నేటి కాలపు భావకవిత్వమునకు తుల్యమగు రచన గావించియున్నాడని వారు వక్కాణింతురు. ఇది నిజము. నన్నయలో వెల్లివిరిసిన భావస్రవంతి పదిశతాబ్దుల కాల మీ దేశములో నవిచ్ఛిన్నముగా బ్రవహించుటయేకాక యది యాధునికాంధ్రకవితారీతులకు బీజప్రాయమైనది. నన్నయకు, దిక్కనకు, గల తారతమ్యమిట తడవక కేవలమాదికవి రచన

ము నే పరిశీలించితిమేని అందలి మధుర భక్తి మనకు చెవుల విందొనరించుననుట కించుకయు సందియము లేదు. నన్నయ భావ వివశుడై నప్పుడాతని భాష ఝరవేగమున బరుగిడును. అదియుగాక నన్నయ కొక యున్నతమగు స్థాయిగలదు. దాని నతడు ప్రశంసా పాత్రముగా నిల్పుకొనెను. భారతాంధ్రీకరణ మసంపూర్ణముగా నుండగనే పరమపదించాడనగా నది మన దౌర్భాగ్యము.

శ్రీ కృష్ణశాస్త్రిగారి కెక్కువగా బాగడిన ప్రాచీనులలో పాండురంగ మాహాత్మ్య కృతికర్తయగు తెనాలి రామకృష్ణ కవి యొకరు. అతనికి కుదిరినట్లుగా సమాసముల కూర్పు పిరెవరికిని గుదురలేదని వారు తెలుపుదురు.

గద్య వాఙ్మయమునెడ శ్రీ కృష్ణశాస్త్రిగారికి నిరాదరణ లేదు. ఉత్కృష్టత నార్జింప నిచ్ఛగించు కవి గద్యమును గూడ విరివిగా జదివి కల్పనాకుశలత నభివృద్ధి పరచుకొనునని వారు తెలిపిరి. ఈ కారణముననే గావచ్చు - వారనేకములగు బంగాలీ నవలలు - ఆంగ్ల భాషాంతరీకృతములు, ఆంధ్రీకృతము లయినవి - నిత్యము చదువుచుండెడివారు.

కృష్ణశాస్త్రిగారు రవీంద్ర సందర్శన మొనర్చి వారి కవితారీతుల నాత్మీయ కవితానిర్మాణమున కొరపిడిరాయిగా గైకొనిరి. ఆ పరమర్షి ప్రసాదించిన మహోన్నతాదేశమే వారిని వైష్ణవ సాంప్రదాయపు రీతులలో రచనగావింప ప్రేరేపించినది. కృష్ణశాస్త్రిగారికి పూర్వ మీయాంధ్ర భాషలో వైష్ణవ సాంప్రదాయమున నెక్కువగా గానము చేసిన వాడొక్క పోతనయే. అట్టి పోతన విమర్శనాతిగమ్యుడని వారి

యభిప్రాయము. పోతన జానపదులకు గూడ వంద్యుడై యున్నాడనగా నది యతని సర్వజన సౌలభ్యమును చాటును.

కృష్ణశాస్త్రిగారు కళాశాలలో బనిచేసిన కాల మత్యల్పము. ఆ కారణమున వారికి తద్రీత్యా నేర్పడిన శిష్యవర్గము నాతిగణ్యము, అయినను వారి రచనలకు ముగ్ధులై తాము నవీన సాంప్రదాయమున గవిత జెప్పుట కభ్యసించి వారి కనుయాయు లనదగినవారు ఇంద్రగంటి, మల్లవరపు, గణపతి శాస్త్రి మున్నగువారు గలరు.

# నేటి తెనుగు కవిత్వము - సాహిత్యగుణము

శ్రీ లక్కావఝుల సుబ్రహ్మణ్యశర్మ ఎమ్. కాం. (పానర్సు)

*

సాహిత్యం అనే మాటకు ఒక నిర్వచనం ఉన్నట్లు కన్పడదు. ఈ పదాన్ని అనేకులు అనేకథా నిర్వచనం చేస్తున్నారు. సాహిత్యమంటే స్వరూప సమున్మేష ఫలకము. ఇది జమ్మలమడకవారి అభిప్రాయం. 'నాలుగు శాస్త్రీయాంశాలు కలిస్తేనే సాహిత్యం' అని శాస్త్రకారులు ఒప్పుకోరు. 'ఒకజాతి సంస్కారం సాహిత్యం' అన్నారు విశ్వనాథ. మన చర్చకు ఈ రెంటినీ ఆధారం చేసుకోవచ్చు.

ప్రస్తుతం ప్రతివాడూ కవే. కథలూ, నాటికలూ, ముఖ్యంగా ఖండకావ్యాలూ చాలా చాలా వస్తున్నాయి. ఇందులో చాలా మఖలోపుట్టి పుబ్బలో పోయేవే. ఇల్లాంటి రచనలు ప్రబంధయుగంలోనూ వున్నాయి. ఎప్పుడూ ఉంటాయి. అయితే 200 సం॥లక్రితం గ్రంథాలైనా ఈనాడు ఎందుకు లేవూ అన్నది ప్రశ్న. మిగతా అల్పకవులమాట అటుంచి, మహాకవుల గ్రంథాలలోనూ కొన్నే మిగిలి, మిగతా కొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. అల్లాంటివి ఎన్నో వున్నాయి.

ఉదా॥ వేములవాడ భీమకవి కావ్యాలు ఏమైనాయి? కవి సార్వభౌముడయిన శ్రీనాథుడు మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, రాసానని చెప్పుకొన్నారు. మరి అవికూడా నిలువలేదు. ఇప్పటి పరిస్థితులు చూద్దాం. ఈ యుగంలో జర్నలిజం వెలిసింది. జర్నలిజం ఏదో సాహిత్యం ఏదో గీతగీసి చెప్పటం కష్టం. Robert Lynd చెప్పింది చూస్తేనుంటే 'Literature that does not last is Journalism, Journalism that lasts becomes literature' అని తెలుస్తుంది. కాబట్టి భవిష్యత్కాలానికి నిలిచేవి కొంత మంచి మహాకవుల కావ్యాలే అవుతాయి. ప్రస్తుతం తెలుగు కవుల కావ్యాలలో కాలానికి ఎదురీదగలవి ఉన్నాయి. వీటిలో సాహిత్య గుణం పుష్కలంగా వుంది.

నవ్యాంధ్ర కవిత్వం మూడు ప్రత్యేక మార్గాలు పట్టింది. శ్రీ శ్రీ, దేవులపల్లి, విశ్వనాథ ఆయా మార్గాలలో నిష్ణాతులు. వీరి రచనా పద్ధతులు చూద్దాం. శ్రీ శ్రీకి కవిగా ఒక విశిష్టమైన స్థానం వుంటుంది. తెలుగు కవిత్వ రచనా నైపుణిలో క్రొత్తదనంకోసం ప్రయత్నించాడు. మనదేశంలో 'సర్రియలిజాన్ని' నాటేందుకు కృషి జేసిన కవి యితను. సర్రియలిజం అంటే అపస్మారక మనస్సునుండి స్వప్నలోక రహస్యాలను సంగ్రహించడానికి చేసే ప్రయత్నం. విప్లవభావ పూరితమైన రచనచేయటం శ్రీ శ్రీ ఆక్రోశం. ఈయన గీతాలు ఎక్కువ శబ్దప్రధానాలుగా ఉంటాయి. పాఠకునిలో నొక విధమైన ఆవేశం కలిగిస్తాయి.

కావ్యంలో కవిస్వరూపం వికసిస్తుంది. అంటే కవి లోకానికి ఆత్మకథలూ, చారిత్రిక విషయాలూ వ్రాస్తానను కోవడం పొరబాటు. తన అనుభవాలను కావ్యాలలో ప్రవేశ పెడతాడు. అధునికులలో ఆత్మాశ్రయరూపమైన ప్రణయ కవిత్వానికి దేవులపల్లివారు అందెవేసిన చెయ్యి. ఈ కవితాలా సుకుమారంగా వ్రాస్తాడు. వాడే శబ్దాలు మధురంగా వుంటాయి. తనలో నిగూఢమైయున్న తాపాన్ని కృష్ణపక్షం నిండా ఊదాడు. ఈ విధమైన కవితానుభవం కష్టమైనది.

విశ్వనాథ వారిదొక విశిష్టమైనపద్ధతి. భావతీవ్రత్వ రసావేశములతో తన్మయులై వ్రాస్తారు. తనదేశాన్ని గూర్చి, తనజాతి సంప్రదాయాన్ని గూర్చి నవలలూ, కావ్యాలూ, నాట కాలూ వ్రాసారు. వేయిపడగలు వంటి దేజాతికి ఉందంతో! వచనప్రబంధమేమో! దేశికవితా వృత్తములతో నిండింది కిన్నెరసాని పాటలు. దీనిలోనూ, మిగతారచనలలోనూ లోక వ్యవహారానికి ఎంతో గౌరముచూపబడింది.

జాతిరసజ్ఞత చావనంతవరకు నిలుస్తుంది ఈ మహాకవి 'రామాయణ కల్పవృక్షం'. లోకంలో ఎప్పుడూ ధర్మమూర్తు లుంటారు. రాక్షసప్రకృతి వాళ్ళుంటారు, వారిమధ్య వివాదం తప్పదు. అన్ని దేశాలలో అన్నికాలాలలో ఇది నిజమౌతుంది. రామాయణంలో వస్తువిట్లాంటిది. ఉత్తమోత్తమమైన కావ్య లక్షణాలు రామాయణంలో తామరతంపరగా కన్పిస్తాయి. శబ్దముపైన ఈ మహాకవికి ఉన్నంత అధికారం మరి ఎవ్వరికీ లేదు. సమాసాలను కవి పద్యరచనచేసేటప్పుడు నిష్ప్రయోజ

వంగావాడేను. శబ్దప్రయోగమువలన అర్థస్ఫూర్తి సాధించేందు కుగా వేస్తాడు.

రాముని మేనిలోని ప్రతిరక్తపుబిందువు జానకీ మనో
జ్ఞామృత భావనాసుమధురాంచిత కోమలపారిజాత మా
లా మధువాసనా భరవిలాసముగా—

ఈ సమాసంవలన రామచంద్రునికి సీతపైనగల అను రాగమెంత గాఢమైనది, పాఠకునిలో స్ఫురింపజేయటం జరుగు తుంది. మేనకా విశ్వామిత్రం తీసుకుందాం. మేనకను ప్రవేశ పెట్టిన పద్ధతి అపూర్వమైంది. వసంత నవశోభ అప్సరసలాగా వచ్చిందని. మేనక ప్రవేశానికిది సూచి.

మాకందతరు శాఖికా కోకిలాప
కౌతుహలాకార కలనజేసి
ప్రాతస్సమాయాత శీతానిలాఘాత
సాధుపల్లవహస్త సంజ్ఞజేసి
రేఖాభవద్వారి శాఖానదీవేణికా
స్రంసిత దుకూలకాంతిజేసి
సామోద కల్హార సంఫుల్ల సరేరు
హాలేకరాత్త మోహనతజేసి
తరుణ శాలీన కోమలాతప విహారి
హృదయవాంఛాప్రసత్ప్రేమ రేఖజేసి
శకలితమరాళకూజి హాసంబుగా వ
సంత నవశోభ వచ్చె నప్సరసవోలె.

తన యింటికి సీతారాములు వచ్చినప్పు డనసూయాదేవి,

ఎండిబెరళ్ళు, పేడెత్తిన వంకర
రావి పుల్లయుబోని రమణగలది
పారిచి ఎండిన మొక్కజొన్న కఱ్ఱలతుదిన్
సోదిపొత్తుల తుది జుత్తుకలది

వచ్చినదనటం సొగసైన అలంకారం. ఇల్లా కావ్యం నిండా చాలా విషయములుంటాయి. ఏ నిర్వచనం సాహిత్యాని కిచ్చినా ఈ మహాకవి రచన కాలాన్ని శాసించి నిలుస్తుంది. విశ్వనాథవారి తరగతికి చెందేవారు వ్రాసిన ఉత్తమ కావ్యాలు చాలా వున్నాయి. ఇవన్నీ సాహిత్య గుణంతో నిండినాయి. కాబట్టి నేటి తెలుగు కవిత్వంలో సాహిత్య గుణం క్షీణించటం లేదనీ చాలా అభివృద్ధిచెందుతోందని చెప్పి విరమించుకుంటా.



# కల్హణుడు

(కాశ్మీరదేశపు చరిత్రకారుడు)

రెంటచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

*

కాశ్మీర దేశపు సాహిత్య చరిత్రలో కల్హణుని పేరు ప్రప్రథమస్థానము నాక్రమించుకొనినది. కవి, చరిత్రకారుడు నైన యీతడు తన జీవితకాలములో గూడ నిప్పటి కీర్తినే గలిగియుండెనో లేదో చెప్పుట కష్టము. కాని నేటి కాలపు పరిశోధకుల కృషి ఫలితముగా నాతని జీవితోదంతములు, వ్యక్తిగత గుణములు వెలుగులోనికి గొనిరాబడినవి. సరిగా నిప్పటికి ఎనిమిదివందల యేండ్ల క్రిత మితడు కాశ్మీరదేశ చరిత్ర వ్రాసియుండెను. ప్రాచీన భారతీయ చరిత్రను వ్రాయుటలో గల్హణుని గ్రంథము చరిత్రకారులకు జాల నుపయోగపడెను.

కల్యాణ శబ్దమునకు ప్రాకృత రూపము 'కల్హణ'. దీని యర్థము 'శుభము' అని. కల్హణుడొక సంపన్న బ్రాహ్మణ కుటుంబమునకు జెందినవాడు. ఆతని తండ్రిపేరు "చంపకుడు". కాశ్మీరదేశ ప్రభువర్గములో నొకడైన చంపకుడు, సేనాపతిగా

బనిచేయుచు, హర్షుని కొలువులో నుండెనని తెలియవచ్చు చున్నది. కల్హణుని జన్మదిన మేదియో మనకు స్పష్టముగా దెలియవచ్చుట లేదు. కాని యాతని గ్రంథములనుండి దొరకిన యంశములనుబట్టి యాతడు క్రీ. శ. 1085—1090 ప్రాంతమున జన్మించెనని నిర్ణయింపవచ్చును.

కల్హణుని సంప్రదాయము చాల పరువుప్రతిష్ఠలు గలది. ఆత డే తెగకు జెందిన పండితుడో గూడ తెలియుచున్నది. వేదరికము వలనను, ధనాశవలనను, రాజానుగ్రహము కొరకై ప్రాకులాడు పండిత బృందమున కాతడు చెంద లేదు. జమీన్దారు లన్నను, భూస్వాము లన్నను నాతడు చాల కంటగించుకొనుచుండెను. వారి దురభిమాన, దురహంకార, దుర్వ్యయము లాకాలములో విపరీతముగా ప్రబలియుండెను. కల్హణుడు తన తండ్రిని గూర్చి యెక్కువగా యుగ్గడించెను. కాని చంపకునివలె రాజైన హర్షునియెడ ప్రేమగాని, భక్తిగాని కల్హణుడెట్టిదో యెరుగడు. రాజకీయ విప్లవమునకు, కుట్రలకు నాకాలము రూఢమైయుండెను. అట్టి కాలములో జీవించుచున్నను చంపకుడు రాజభక్తిపరాయణుడై నిష్కళంకమగు సచ్చరిత్రను గలిగియుండెను. హర్షుడు చంపకుని సత్కరించుటలో జాలపర్యాయములు లోభపడెను. ఇందుకై కల్హణుడు హర్షుని పెక్కుచోట్ల నపహసించియుండెను. దారాదు సరిహద్దులలో గల దుగ్ధఘటము కోటపై దాడిచేయుటకు హర్షుడు వెడలిన సమయమున చంపకుడు ప్రభుభక్తిపరాయణుడై తన బలము నవ్యాజముగా ప్రకటించెను. విప్లవకారులైన కొందరు

భూస్వాములతో జరిగిన పోరాటములలో చంపకుడు హర్షుని పక్షమయిన నిలిచి కడవరకు పోరాడెను.

తనతండ్రి జీవనఘట్టమును, సచ్ఛీలమును కల్హణుని మనస్సున కెక్కియుండవలెను. ఆతడు తన జన్మము, తాత తండ్రుల గౌరవప్రతిష్ఠలు తలపోసి గర్వించియుండెననిన నాతనికి దన వంశపారంపర్యము నెడగల యభిమాన మెట్టిదో స్పష్టమగు చున్నది. చంపకుని సోదరుడును కల్హణుని పినతండ్రియునైన యొక సంగీత విద్వాంసుడు హర్షుని సభలోనుండి యాతనివలన నమూల్యములగు బహూకృతు లందుకొనుచుండెనని తెలియ వచ్చుచున్నది. కల్హణుని తండ్రియు బినతండ్రియు మతమూల జీవనులే యైనను, నిరుపమానమైన సహనము గలిగియుండిరి. స్వార్థపరులైన ప్రాంతీయ పాలకులును, భూస్వాములును, ఇట్టి సచ్ఛీలము నావంతయు నలవరచుకొనకుండ జీవించు కాలములో వారి యుద్వృత్త మన్నివిధముల బ్రశంసార్హ మగుచున్నది. తన పినతండ్రి రాజుతో తనకుగల యపారమైన స్నేహమును బురస్కరించుకొని తమ స్వస్థలమగు పరిహాస పురమునగల బుద్ధవిగ్రహమును నిర్మూలింపబడకుండ గాపాడిన విధమును కల్హణు డొకానొకచో విశదపరచెను. అప్రధానము లగు నిట్టి చిన్న విషయములనుగూడ నతడు గర్వముతో సమోదముతో వక్కాణించియుండెను. కులముగాని, విద్య గాని ఆతనికి ప్రేరణములుగా లేదు. ధర్మతత్వము, మనో వికాసము అనునవియే యాతనికి నమూల్యములుగా దోచినవి.

కల్హణుని పూర్వీకులు శైవమతావలంబులు. ఇప్పుడు బుద్ధేశ్వర మనబడు నాటి నందిక్షేత్ర తీర్థములను కల్హణుని

తండ్రి ప్రతి సంవత్సరము సేవించుచుండెను. అట్టి యాత్రలలో కల్హణుడు తండ్రి వెంట తప్పక పోయియుండును. మతము నందు ప్రేమ, శైవశాస్త్రములయందు పరిజ్ఞానము ఆతడు తండ్రి నుండియే యలవరచుకొని యుండును. స్వమతాభిమానమువలన నాతని పరమత సహనము కుంటువడలేదు. బౌద్ధమతము నెడలను, బౌద్ధ భిక్షువుల యెడలను నాతనికిగల గౌరవమపారము. కల్హణుని రచనలు బౌద్ధమతము నెడల నాతనికిగల ప్రేముడి నన్నివిధముల చాటుచున్నవి. అతని చుట్టు నుండిన మత పరిసరమాతనిని కవితా కృషి దూరునిగా జేయలేదు. ఆధ్యాత్మికతామృతత్త్వము బడయుటలో గవిత్వమమూల్యమైన సాధనగా నతడు గ్రహించెను. యువకవులకును, ప్రౌఢ కవులకును నాతడిచ్చిన ప్రణయాంజలియే యిందులకు దృష్టాంతము.

ప్రాచీన వాఙ్మయ పఠనమున కల్హణునకు నియమబద్ధమైన శిక్షణ లభించెను. ఛందోవ్యాకరణములలో నసమాన ప్రౌఢిమ నార్జించెను. రామాయణ, మహాభారతములనిన నాతనికిగల యత్రోత్కంఠ మపారాతీతము. బాణుని హర్ష చరిత్రము, బిల్హణుని విక్రమార్క దేవచరిత్రము కల్హణునిపై విపరీతమైన ప్రభావము చూపెను. ఆతని స్వతంత్రత, రచనా భంగిమ చాలా యుక్తమములు. ప్రాచీన రచయితల నాతడనుకరించుటకు బూనుకొనలేదు. అయినను బాణ, బిల్హణుల ప్రభావము మాత్ర మాతని శైలిలో ద్యోతకమగును. ఆతని పాండిత్య మా కాలమున కెంత విస్తృతముగా నుండదగునో యట్లే యుండెను. ఖగోళ శాస్త్రమునందును పురాణముల

యందును నాతడార్జించిన విజ్ఞానము సాటిలేనిది. కల్హణుని సమకాలికుడును, కాశ్మీర దేశపు మరియొక కవియునైన మంఖుడు తాను వ్రాసిన శ్రీకంఠ చరితములో కల్హణుని గూర్చి యిట్లు నుడివెను; "కావ్య నిర్మాతలలో నీలడగ్రగణ్యుడు. ముకురాయమానమై నవ్యతమ శోభలొలుకుచు నీతని కవిత్వము బిల్హణుని కవిత్వమువలె నతి రమ్యముగా నున్నది" నాటి రచయితను గూర్చి యొక సమకాలికుడైన కవి యిచ్చిన యీ యభిప్రాయము నిజముగా చాల యెక్కువైనది. కథలనినను, పరంపరాగత గాథలనినను, చరిత్ర యనినను కల్హణునికి గల ప్రేమను గూర్చి మంఖుడు విస్మరింపలేదు. పురాణములయందలి మనోజ్ఞమైన కవితా శైలి వలనను, ఇతిహాసములయందలి మాన వైతిహ్య ప్రేరణవలనను ముగ్ధుడై కల్హణుడు కాశ్మీరదేశచరిత్ర వ్రాయుటలో మహోన్నతాశయమును సాధించి సఫలుడయ్యెను. సమకాలికోదంతములను విపులపరచు పట్టున కల్హణ కవి యసాధారణమగు ప్రజ్ఞను చూపెను. పురాతన కాశ్మీరదేశ స్థల వివరణములో నాతని పరిజ్ఞాన మీర్ష్యాజనకము.

కాశ్మీరదేశపు రాజ్యాంగచరిత్రలో నొక యాందోళనాపూరితమైన కాలముతో కల్హణుని జీవితకాలము ముడివడి యున్నది. ప్రభుత్వమొకటిగాదు. ప్రజానీకముయొక్క క్షేమాదికములనుగూడ మార్చగలిగిన సంఘటనలొకదాని వెంబడి మరొకటి తటస్థించుచుండెను. కల్హణుని రాజతరంగిణియే మనకు లేనియెడల నాటి సంఘటనలను గూర్చి యేమియు దెలిసియుండెడిదిగాదు. క్రీ. శ. 1089 నుండి 1101 వరకు

పాలించిన హర్షుని దుర్విదగ్ధతవలన నాదేశములో విపరీతమైన అలజడి, హత్యాకాండ జరిగినది. ప్రభుత్వ బొక్కసములోగల ధనమునకు అతీతమైన ఖర్చుతో అతడు తన రాజ్యాంగమును నిర్వహించుచుండెను. ఆ అదనపు మొత్తమును రాబట్టుటకు ఎక్కువ పన్నులువిధించెను. భూస్వాములవద్దనుండి యెక్కువ కప్పమును కోరెను. దేవాలయముల యీనాముల నుండికూడ డబ్బును సేకరించెను. ఈ సంఘటనలన్నియు తప్పని ఫలితము లిచ్చెను. కల్హణుని వచోమయచిత్రణ వలన నాతడా సంఘటనలయొక్క ప్రభావముక్రిందనుండి సంఘముపైనను, సమకాలిక వ్యవహారములపైనను ఎట్టి దృక్పథము కలిగియుండెనో స్పష్టమగుచున్నది. అతడు కావించిన వర్ణనలే యాతని మూర్తిమత్వమును ప్రతిఫలించు నద్దమైయున్నవి.

కల్హణుని కుటుంబము వారాక్రమించిన యున్నత పదవి వలన నాతని కాకాలపు ప్రధాన వ్యక్తులతో బరిచయము సంపాదించుటకు దగిన సదవకాశము లభించినది. జ్ఞానగర్భితమైన మానముదాల్చిన వాడయ్యు దనచుట్టునున్న బాధాయుతమైన ప్రపంచమును విమర్శించుటలో నాతడు గొప్ప పరిశీలన, అత్యకుటిలమైన మనస్సు గన్పరచెను. కావుననే యాతడు గొప్ప చరిత్రకారుడుగూడ నయ్యెను. మానవస్వభావము లోనికి జొరజాలిన దృక్పథము, తనదేశమును గూర్చిన భౌగోళిక జ్ఞానము, యచ్చటి వస్తుసంపదను గూర్చిన శేముషీ సాధారణముగా నే కవికిని అబ్బుట యరుదు. తనకాలపు వ్యక్తులను, నాటి సంఘటనలను గూర్చి విశదీకరణములోనేగాక సాంఘికముగాను చారిత్రికముగాను వాటిని పొదుగుటలో నాత

డసామాన్యమగు శిల్పమును జూపెను. సాంఘిక సమస్యావిభజనము నాతడు సరిగా జేసెను. ఆనాటి సంఘటనలన్నియు వానిపైననే యాధారపడియుండెను.

కాశ్మీరదేశపు జమీందారుల కాకాలమున దామరులని పేరు. వారు చాల అధికారము కలిగియుండిరి. రాజ్యాంగమునందొక కక్షగానుండిరి. వారి నణచుటకు హర్షుడుపూనుకొనెను. కుట్రలచేతను, ప్రతికుట్రలచేతను రాజ్యాంగమును లోబరచుకొనుటకు జాలప్రయత్నములు జరుగుచుండెను. కల్హణుడట్టి స్వోత్కర్ష యనిన మిగుల విసుగుచెంది యుండెను. అప్పటి పరిస్థితులవలన భూస్వాములందరు నేకమై సాయుధ విప్లవధీరులై, ఉక్కలుడు, సుస్సలుడు అను నిరువురు రాజకుటుంబీకుల నాయకత్వమున రాజు నెదిరించి, సింహాసనభ్రష్టుని చేసి, తరువాతచంపిరి. ఈ సంఘటనలన్నిటిని మిక్కిలిబాధతో కల్హణుడు వివరించెను. హర్షుడీవిధముగా బలాతిరేకులగు శత్రువులచే రాజ్యభ్రష్టుడు గావింపబడినపిమ్మట కల్హణుని కుటుంబమునకు పూర్వమున్న ధనార్జనయు సన్నగిల్లెను. చంపకుడామీదట రాజకీయములలోని కెన్నడు అడుగిడలేదు. ప్రజాహిత జీవనమునుండి విరమించుకొనిన తరువాత ముప్పదిసంవత్సరములు చంపకుడు జీవించెను. అప్పటికి కల్హణుడు చాలచిన్నవాడు. కాని చాలస్వతంత్రతయు, కోమలహృదయము కలవాడగుటచేనే పాలకుని క్రిందను కొలువులో జేరుట కాతడిచ్ఛగింపలేదు. ఒకరి యనుగ్రహమునకై ప్రాకులాడుటకాతడు నిగర్వి గాడు. ఆతడు క్రీ. శ. 1148–49 లో రాజతరంగిణిని వ్రాయబూనినప్పుడు సుస్సలుని కుమారుడైన జయసింహుడు పాలించు

చుండెను. జయసింహుని శీలమనిన దనకుగల జుగుప్సనాతడించు కయు మరుగుపరచలేదు. సుస్సలుని క్రౌర్యమును అత్యాశను అతడు ఖండించెను. కాని భిక్షాచారుని బలపరాక్రమముల నుగ్గడించెను. అయినను అతని రాజకీయ యాశయముల నాతడు తీవ్రముగా నిరసించెను.

తనదేశీయుల నడవడినిగూర్చి యాతడిచ్చిన సాభిప్రాయ విశేషములు కల్హణుని పరిశీలనాశక్తికి, విమర్శనాశక్తికి తార్కాణములు. దామరులయెడ నాతడత్యంతమగు వేసటగనబరచెను. వారినొక దొంగలగుంపుగా నాతడు వర్ణించెను. తానొక యున్నతోద్యోగి కుమారుడై యుండియు, యున్నోద్యోగి తరగతికి చెందినవారిపై నాతడేమియు సౌత్సుక్యము గనబరుపడయ్యెను వారి హీనత్వవాక్కులనుగూర్చి యాతడు చాల హేళనచేసెను. తాను బ్రాహ్మణకులీనుడయ్యు పురోహితుల యెడలను. ఋత్విగాదులయెడలను చాల క్రోధమూనెను. ప్రధాన యాత్రా కేంద్రములలో జరుపబడు పరిషత్తులలో నీ పురోహితులు పాల్గొనెడువారు. వారి అజ్ఞానము, వారి అలత్యము, రాజకీయములయందు వారు కల్గించుకొను అనవసరజోక్యము, మొదలగువానిని కల్హణుడు హాస్యప్రధానము, విమర్శనా రూపకమునైన తన రచనలో పెక్కుతావుల నపహాసించెను. శాంతికాములైన ప్రజల స్వభావమాతనికి ముదావహము నొసగె. కడచిన యున్ని సంవత్సరములలోను వారు ప్రశాంతులై యుండిరి.

రాజతరంగిణివల్లనే కల్హణుడు మనకు గోచరమగు చున్నాడు. అతని యితర సారస్వత విజయములనుగూర్చి మ

కేమియు దెలియదు. హిందూమతము, సంస్కారము అన్నియు నాచార రూపములుగామారియున్న కాలములో నాతడు జీవించెను. జాతి, కులవివక్షతలు శిలాప్రాయములై రూఢికెక్కి యుండెను. రాజకీయ సంస్థలు భిన్నభిన్న వర్గములవారి యాధిపత్యమునయుండెను. పౌరులు యథాజీవనులై రాజకీయ సంఘటనలవలన నేమియు తబ్బిబ్బుకారైరి. కల్హణుని విద్యాభ్యాస పరిపోషణములు సాంప్రదాయమున కేమియు విరుద్ధముగా నుండి యుండవు. కాని యాతడు నిష్పక్షపాత అనను రక్తము నైన దృక్పథముతో సమకాలికాచార వ్యవహారాదులను విమర్శించెను. ఆతని అధిగమనము మానవత్వముచే పరిపూర్ణమైయుండెను. ఆతడెట్టి సమయము లందును, ఏరాజుయొక్క యాశ్రయమును కోరక పోవుటయే యాతని వ్యక్తిత్వ నిరూపణకు హేతువయ్యెను. శ్రమార్జితమైన పాండితి, ప్రతివిషయమును సర్వాంకషముగా చర్చించుట మున్నగు గుణములుకలవై యాతనిచే వ్రాయబడిన రాజతరంగిణి భావితరముల వారి యనూనమగు సొత్తైయున్నది. తన రచననుగూర్చి యాతడిట్లు వ్రాసెను. "ఇందలి విషయములు బహుముఖములగుటవలన, ఇంకను విస్తరించి వ్రాయుటకు వీలుబడదయ్యెను. అయినను సత్స్వభావులకిది మోదదాయకముకాగలదు."

